బాలవిజ్ఞానగ్రంథమాల. ౧.

# శతకపద్యమంజరి

(రెండవతరగతి.)

(పద్యవాచకము.)



సంపాదకుఁడు

విమర్శాదర్శక

ఆంధ్రగ్రంథమాల. ౧౦

వెల అణా

# శతకపద్యమంజరి.

(రెండవ తరగతికి)

(పద్యపాఠములు.)



సంపాదకుఁడు

విమర్శాదర్శక

నడకుదుటి వీరరాజకవి

పిఠాపురము.

# పీఠిక.

---

దేశభాషాభివృద్ధికి బాల్యవాఙ్మయమే పునాదిగానుండెడిది. మేధాశక్తిని పెంపొందించుటకు మనపూర్వులు మొన్నమొన్నటి నుండి పద్యగ్రంథములనే రచియించుచు వచ్చిరి.

విద్య నభ్యసింపఁ గోరు బాలురును, బాలికలును బాల్యమునుండియు నలవఱుచుకొనవలసిన సుగుణములలో నీతియు, దైవభక్తియుఁ బ్రధానములైనవి మేధాశక్తితోపాటు పై గుణములను పెంపొందించుటకు మనపూర్వులు, మనోహరముగను, జాతీయముగను, నిత్యానుభవజ్ఞాపకములుగను నుండునట్లు, సులభశైలిని రచియింపఁబడిన శతకములు మొదలగు వానిని దొలుదొలుత తమతమ బిడ్డలచే పఠింపఁజేయుచు వచ్చిరి. ఈయాచారము మొన్నమొన్నటివఱకు వీధిబడులలోఁ బ్రాముఖ్యముగ నుండెడిది. ప్రాథమికపాఠశాలలు నెలకొల్పఁబడిన ప్రథమదినములలో సైత మవ్వటి యుపాధ్యాయు లితరపాఠ్యపుస్తకములతోపాటు భాషాభివృద్ధికరములగు పద్యగ్రంథములను ప్రధానాంగముగ వాడుచు వచ్చిరి.

కాలక్రమమున నాపద్ధతి మాఱి, యిప్పటిప్రధానపాఠ్యగ్రంథములలో (వాచకములలో) నేవియో కొన్ని పద్యములు

మాత్రము కొదవట చేర్పంబడు నాచార మేర్పడినది. కాని, అది పిల్లల భాషాజ్ఞానాభివృద్ధికిని, ననుదినజీవితానుభవమునకును దగినంత సాధకముగాఁ గనఁబడకున్నది. దానంజేసి నా మిత్రులగు కొందఱు స్థానికాధికారులయు విద్యాధికారులయుఁ బ్రోత్సాహమున పూర్వశతకాదివాఙ్మయమునుండి యథాయథా తరగతుల విద్యార్థుల కనుకూలములుగ నుండునట్లు పద్యముల నేర్చి కూర్చి 'శతకపద్యమంజరి' యను పేరితో నైదు పుస్తకములుగఁ బ్రకటించితిని.

విద్యాశాఖాధికారులును, దేశభాషాభిమానులగు స్థానిక విద్యాధికారులును నా యీ పరిశ్రమమునకుఁ దగిన ప్రోత్సాహము నొసఁగఁగూర్తు రని విశ్వసించుచున్నాఁడను.

సంపాదకుఁడు,

# వి ష య సూ చి క.





# శతకపద్యమంజరి

మొదటి భాగము.

## ౧ సుమతిశతకము

శ్రీరాముని దయచేఁ దగ
నారూఢిగ సకలజనులు ♦ నారా యనఁగా
ధారాళమైననీతులు
నోరూరఁగఁ జవులుపుట్ట నుడివెద సుమతీ! 1

క. అక్కఱకు రానిచుట్టము
మ్రొక్కిన వర మీనివేల్పు మోహరమునఁ దా
నెక్కినఁ బాఱనిగుఱ్ఱము
గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ! 2

క. అడియాస కొలువు గొలువకు
గుడిమణియము సేయఁబోకు కుజనులతోడన్
విడువక కూరిమిసేయకు
మడవిని దో డరయ కొంటి నరుగకు సుమతీ! 3

క. అప్పిచ్చువాఁడు వైద్యుఁడు
నెప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుఁడుం
జొప్పడినయూర నుండుము
చొప్పడ కున్నట్టియూరఁ జొరకుము సుమతీ! 4

క. ఇమ్ముగఁ జదువనినోరును
అమ్మాయని పిలిచి యన్న మడుగనినోరుం
దమ్ములఁ బిలువని నోరును
గుమ్మరి మను ద్రవ్వినట్టి గుంటర సుమతీ! 5

క. ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁ గలుగనేర్చు నెయ్యెడలం దా
నెత్తిచ్చి కరఁగిపోసిన
నిత్తడి బంగార మగునె యిలలో సుమతీ! 6

క. ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ! 7

క. ఎప్పుడు దప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁగూడ దది యెట్లన్నన్
సప్పంబు పడగనీడను
గప్ప వసించిన విధంబు గదరా సుమతీ! 8

క. ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్నం
దెప్పలుగఁ జెఱువు నిండిన,
కప్పలు పదివేలు చేరు గదరా! సుమతీ! 9

క. కూరిమి గల దినములలో
నేరములెన్నఁడును గలుగనేరవు మఱి యా
కూరిమి విరసం బైనను
నేరములే తోఁచుచుండు నిక్కము సుమతీ! 10

క. కొఱగాని కొడుకు పుట్టిన
కొఱగామియె కాదు తండ్రి గుణములు చెఱుచుం
జెఱకుతుద వెన్ను పుట్టినఁ
జెఱకునఁ దీపెల్లఁ జెఱుచు సిద్ధము సుమతీ! 11

క. చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైనయట్లు పామరుఁడు దగన్
హేమంబుఁ గూడఁ బెట్టిన
భూమీశులపాలఁ జేరు భువిలో సుమతీ! 12

క. చుట్టములు గానివారలు
చుట్టములము నీకటంచు సొంపు దలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబుగలుగఁ గదరా సుమతీ! 13

క. చేతులకుఁ దొడవు దానము
భూతలనాథులకుఁ దొడవు బొంకమి ధరలో
నీతియె తొడ వెవ్వారికి
నాతికి మానంబు తొడవు నయముగ సుమతీ! 14

క. తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁక నుండు వృశ్చికమునకుం
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ! 15

క. నయమునఁ బాలుం ద్రావరు
భయమునను విషమ్ము నైన భక్షింతురుగా
నయ మెంత దోసకారియొ
భయమే చూపంగవలయు బాగుగ సుమతీ! 16

క. పురికిని బ్రాణము కోమటి
వరికిని బ్రాణంబు నీరు వసుమతిలోనం
గరికిని బ్రాణము తొండము
సిరికిని బ్రాణంబు మగువ సిద్ధము సుమతీ! 17

క. పెట్టినదినములలోపల
నట్టడవుల నైన నబ్బు [illegible]
బెట్టనిదినములఁ గనకపు
గట్టెక్కిన నేమిలేదు గదరా సుమతీ! 18

క. బలవంతుఁడ నా కే మని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా?
బలవంత మైన సర్పము
చలిచీమలచేతఁ జిక్కి చావదె సుమతీ! 19

క. రూపించి పలికి బొంకకు
ప్రాపగు చుట్టంబు నెగ్గు పలుకకు మదిలోఁ
గోపించురాజుఁ గొల్వకు
పాపప్రదేశంబు సొరకు పదిలము సుమతీ! 20

క. లావు గలవానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుం డౌ
గ్రావంబంత గజంబును
మావటివాఁ డెక్కినట్లు మహిలో సుమతీ! 21

క. వఱదైన చేను దున్నకు
కఱవైనను బంధుజనుల కడకేఁగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళవాయితనము పెట్టకు సుమతీ! 22

క. వరిపంట లేని యూరును
దొర యుండని యూరు తోడు దొరకని తెరువున్
ధర నృపతి లేని రాజ్యము
నరయంగా రుద్రభూమి యనఁదగు సుమతీ! 23

క. స్త్రీలయెడ వాదు లాడకు
బాలురతోఁ జెలిమిచేసి భాషింపకుమీ
మేలైనగుణము విడువకు
మేలినపతి నిందసేయ కెన్నఁడు సుమతీ! 24

క. సిరి దా వచ్చిన వచ్చును
సరిపోల్పఁగ నారికేళసలిలముభంగిన్
సిరి తాఁ బోయినఁ బోవును
గరి మ్రింగిన వెలఁగపండుకరణిని సుమతీ! 25

క. వినఁదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁదగున్
గని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలో సుమతీ! 26

# ౨ వేమన శతకము

ఆ. చిత్తశుద్ధి గలిగి చేసినపుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదవ గాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత?
విశ్వదాభిరామ! వినుర వేమ! 1

ఆ. నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు,
తళుకుబెళుకురాళ్లు తట్టెఁ డేల?
చమురుపద్య మరయఁ జాలదా యొక్కటైన
విశ్వదాభిరామ! వినుర వేమ! 2

ఆ. ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండుఁ
జూడఁజూడ రుచులజాడ వేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేఱయా
విశ్వదాభిరామ! వినుర వేమ! 3

ఆ. అనువు గానిచోట నధికుల మనరాదు
కొంచె ముండు టెల్లఁ గొదవ గాదు
కొండ యద్దమందు గొంచెమై యుండదా
విశ్వదాభిరామ! వినుర వేమ! 4

ఆ. పెట్టి పోయ లేని వట్టివారలు భూమి
పుట్ట నేమి వారు గిట్ట నేమి
పుట్టలోనిచెదలు పుట్టవా? గిట్టవా?
విశ్వదాభిరామ! వినుర వేమ! 5

ఆ. తామసించి చేయుఁదగ దెట్టికార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయ దెచ్చి పడవేయ ఫల మౌనె?
విశ్వదాభిరామ! వినుర వేమ! 6

ఆ. అల్పుఁ డెపుడుఁ బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పలుకుఁ జల్లఁగాను
కంచు మ్రోఁగినట్లు కనకంబు మ్రోఁగునా?
విశ్వదాభిరామ! వినుర వేమ! 7

ఆ. మేడిపండుఁ జూడ మేలిమై యుండును,
పొట్ట విచ్చిచూడఁ బురుగు లుండు,
పిఱికివానిమదిని బింక మీలాగురా
విశ్వదాభిరామ! వినుర వేమ! 8

ఆ. అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచు నుండు,
తినఁగఁ దినఁగ వేము తీయ నగును
సాధకమున వనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 9

ఆ. గంగిగోవుపాలు గంటెఁడైనను జాలు,
కడవెఁడైననేమి ఖరముపాలు
భక్తి గలుగు కూడు పట్టెఁడైనను జాలు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 10

ఆ. అంకె లెఱిఁగి మాటలాడ నేర్చినపుడు
పిన్న పెద్దతనము లెన్ననేల ?
పిన్నచేతిదివ్వె పెద్దగా వెలుఁగదా
విశ్వదాభిరామ ! వినుర వేమ! 11

ఆ. పరఁగ ఱాతిగుండు పగులఁ గొట్టఁగవచ్చు,
కొండ లన్ని పిండి గొట్టవచ్చు,
కఠినచిత్తుమనసు కరఁగింపఁగా రాదు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 12

ఆ. ఎలుకతోలు తెచ్చి యెందాఁక నుదికిన
నలుపు నలుపె కాని తెలుపు గాదు
కొయ్యబొమ్మఁ దెచ్చి కొట్టిన గుణి యౌనె?
విశ్వదాభిరామ! వినుర వేమ! 13

ఆ. పొడుగు త్రాట రాయి పొట్లకాయకుఁ గట్ట
లీలతోడ వంకలేక పెరుఁగు,
కుక్కతోఁకఁ గట్టఁ గుదురునా చక్కఁగా?
విశ్వదాభిరామ! వినుర వేమ! 14

ఆ. కండచక్కెరయును గలియఁ బాల్పోసిన,
తత్రిమి పాము తిన్నుఁ గఱచుఁ గాదె
కపట మున్న వార లుపకార మెంతురా?
విశ్వదాభిరామ! వినుర వేమ! 15

ఆ. కానివానితోడఁ గలసి వర్తించిన
హాని వచ్చు నెంతవాని కైన,
ఈఁగ కడుపుఁ జొచ్చి యిట్టట్టు సేయదా?
విశ్వదాభిరామ! వినుర వేమ! 16

ఆ. కులములోన నొకఁడు గుణహీనుఁ డుండిన
కులము చెడును వానిగుణమువలన
వెలయఁ జెఱకునందు వెన్ను పుట్టినరీతి
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 17

ఆ. చేలుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును
చీడపుర్వు చేరి చెట్టుఁ జెఱుచు
కుచ్చితుండు చేరి గుణవంతుఁ జెఱుచురా?
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 18

ఆ. తప్పు లెన్నువారు తండోపతండమ్ము
లుర్వి జనుల కెల్ల నుండుఁ దప్పు
తప్పు లెన్నువారు తమతప్పు లెఱుఁగరు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 19

ఆ. కోపమునను ఘనత కొంచెమై పోవును
కోపమునను మిగుల గోడు చెందు
కోప మడఁగనేని కోరిక లీడేఱు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 20

# కృష్ణశతకము

శ్రీరుక్మిణీశ! కేశవ!
నారదసంగీతలోల! నగధర! శౌరీ!
ద్వారకనిలయ! జనార్దన!
కారుణ్యముతోడ నన్నుఁ గావుము కృష్ణా! 1

క. నీవే తల్లివి దండ్రివి
నీవే నాతోడు నీడ నీవె సఖుఁడవున్
నీవే గురుఁడవు దైవము
నీవే నాపతియు గతియు నిజముగ, కృష్ణా! 2

క. నారాయణ! పరమేశ్వర!
ధారాధరనీలదేహ! దానవవైరీ!
క్షీరాబ్ధిశయన! యదుకుల
వీరా! నను(గావు కరుణ వెలయఁగ, కృష్ణా! 3

క. హరి యను రెండక్షరములు
హరియించును, పాతకముల నంబుజనాభా!
హరి! నీనామమహత్త్వము
హరి! హరి! పొగడంగవశమె హరి! శ్రీకృష్ణా! 4

క. ఓ కారుణ్యపయోనిధి!
నా కాధారంబ వగుచు నయముగఁ బ్రోవన్
నాకేల యితరచింతలు
నాకాధిపవినుత! లోకనాయక! కృష్ణా! 5

క. అందెలు గజ్జెలు మ్రోయఁగ
చిందులు ద్రొక్కుచు వేడ్క చెలువారంగా
నందునిసతి యాగోపిక
ముందర నాడుదువు మిగుల మురియుచు కృష్ణా! 6

క. గిరు లందు మేరు వౌదువు
సురలందును నిందుఁడౌదు చుక్కలలోనం
బరమాత్మ! చంద్రుఁ డౌదువు
నరులందును నృపతి వౌదు నయముగ, కృష్ణా! 7

క. చుక్కల నెన్నఁగ వచ్చును
గ్రక్కున భూరేణువులను గణుతింప నగున్
జొక్కపు నీగుణజాలము
నక్కజముగ లెక్కపెట్ట నగునా? కృష్ణా! 8

---

# కుమారీశతకము

క. శ్రీ భూ నీళా హైమవ
తీ భారతు లతులశుభవతిగ నెన్నుచు న
త్సౌభాగ్యము నీ కొసఁగఁగ
లో భావించెదరు ధర్మలోల ! కుమారీ ! 1

క. చెప్పెడి బుద్ధులలోపలఁ
దప్పకు మొకటైన సర్వధర్మములందున్
మెప్పొంది యిహపరంబుల
తప్పింతయు లేక మెలఁగఁ దగుఁజుమ్ము, కుమారీ ! 2

క. ఆటల, పాటలలో నే
మాటయు రాకుండఁ దండ్రిమందిరమందుం
బాటిల్లుకాఁపురములో
వాట మెఱిఁగి మెలఁగుచుండవలయు, కుమారీ ! 3

క. అమ్మకు రెం డబ్బకు రెం
డిమ్మహిఁ దిట్టించుకూఁతు రెందుకు ధర నా
దొమ్మరి పుట్టకపోయిన
నిమ్మళ మని యందురి జనులు నిజమ్ము కుమారీ ! 4

క. పోకిళ్లు పోక, పొందిక
నాకుల్లలో, పిండెగొని నడఁచుకొనఁగా నెం
తో కలసిమెలసి యుండిన
లోకములోపలను దా వెలుంగు, కుమారీ! 5

క. కడుఁ జెడ్డపాటుఁ దెచ్చిన
చెడు గయ్యి వర్తించెనేని చిరతరచింతం
బడుదురు తలిదండ్రులు, తోఁ
బడుచులు, సోదరులు; నిందఁ బడుదు కుమారీ! 6

క. కులదేవతలకుఁ బెట్టిన
పొలుపున్న దనయింటియాఁడుబొట్టెల కెల్లం
గలమాత్ర మొసగ కుండిన
గలఁత పొడము దాన మేలు గాదు కుమారీ! 7

క. బద్ధకము వంజనిద్దుర
పెద్దనుమీ దద్దిరంబు వచ్చును దానన్
గద్దింతు రింటివారలు
పెద్దందురు తోడివారు ముద్దు కుమారీ! 8

క. ఇంటఁ గలగుట్టు నీపొ
గింట రవంతైనఁ దెలుపఁ నేఁగకు దానన్
గంటకపడి నీవారలు
గెంటించెద రిల్లు వెడలఁ గినుక, కుమారీ! 9

క. తలవాకిట నెల్లప్పుడు
నిలువఁగరా దెప్పు డెంత నిద్దురయైనన్
మెలఁకువ విడరాదునుమీ
తల నడచుచు విప్పికొనుట తగదు కుమారీ! 10

క. వారికి వీరికిఁ గలిగాను
గోరిన వస్తువులు మాకె కొదవారెను నటం
చూరక గుటకలు మ్రింగుట
నేరముగాఁ దలపవలయు నెలఁత! కుమారీ! 11

క. నడకలలో నడుగుల చ
ప్పుడు వినఁబడకుండవలయు, భువి గుంటలు గ
స్పడరాదు మడమనొక్కుటఁ,
బడఁతుల మర్యాద తెలిసి బ్రతుకు కుమారీ! 12

క. నవ్వంగరాదు పలుమఱు
నవ్వినఁ జెడునవ్వుగాని నగరా దెపుడున్
గవ్వలవలె దంతంబులు
జవ్వన గానంగఁబడెడి జాడ, కుమారీ ! 13

క. సన్నికలుం బొత్తిమ్మును
వన్నెక పోరాదు కాలఁ దగిలినయెడలన్
గన్నుల నద్దుకొనవలెఁ
గ్రిన్నన సిరియుంట నిలుచుఁగాన కుమారీ ! 14

క. సరకులయెడ జాగ్రత్తయుఁ
జులుకు పనులయందు, భక్తి సుజనులయందున్
గరుణ యనాథులయెడలం
దరుణికిఁ జెలువారవలయు ధరణి, కుమారీ ! 15

క. చెప్పినఁ జెప్పక యుండిన
తప్పక చేయంగవలయుఁ దనపను లెల్లన్
మెప్పొందవునట్లు లేదా
ముప్పొందవును గాదె యెందు ముద్దు కుమారీ ! 16

క. ఎంగిలి పసులకుఁ బెట్టకు
[illegible]గున మ్రోఁగియుంగ నీవు కాల్మట్టియలన్
బంగారులాభ ముండిన
దొంగతనము సేయుబుద్ధిఁ దొ[illegible]పు కుమారీ ! 17

క. చెప్పకు చేసినమేలు నొ
కప్పు డయినఁ గాని దాని హర్షింపరుగా!
గొప్పలు చెప్పిన నదియును
తప్పేయని చిత్తమందు దలఁపు [illegible] ! 18

క. కలహాపడు నింట నిలువదు
కలుముల జవరాలు; కాన కలకాలం బే
కలహములు లేక సమ్మతి
మెలఁగంగా నేర్చు కొంతో మేలు కుమారీ ! 19

క. మఱవవలె కీడు; నెన్నఁడు
మఱవంగారాదు మేలు, మర్యాదలలోఁ
దిరుగవలె సర్వజనముల
దరిఁ బ్రేమ మెలంగవలయు ధరణిని, కుమారీ ! 20

క. ఇద్దఱు గూడుక యొకచో
నొద్దిక మాటాడుచుండ నొదిఁగి యొదిఁగి యా
యొద్దకుఁ జనఁగూడదు తన
పెద్దతనం బెల్ల నణఁగఁబెట్టి, కుమారీ! 21

## గుణము

సీ. పార్వతీపతి తెల్పు, పాలసంద్రము తెల్పు
కామధేనువు తెల్పు కంబు తెల్పు
నారదముని తెల్పు శారదాభ్రము తెల్పు
శారదాంబిక తెల్పు నంచ తెల్పు
ఆదిశేషుఁడు తెల్పు, *ఐరావతము తెల్పు,
అమృతపూరము తెల్పు హంస తెల్పు
కల్పవృక్షము తెల్పు కైలాసగిరి తెల్పు
మల్లెపూవులు తెల్పు మంచు తెల్పు
చందురుండు తెల్పు జాహ్నవీనది తెల్పు
నవ్వు తెల్పు చందనంబు తెల్పు
తెలుపు చెప్పనేల తెలివికి మేలైన
గుణము గలిగెనేని కోటిసేయు. 1

---

* బిడ్డలపరవసౌకర్యార్థము వింధిగ [illegible]ఁజేసినవి

# లఘు టీక.

## సుమతిశతకము.

(1) ఆరూఢిగఁ=నిశ్చయముగా; ధారాళ మైన=అడ్డులేని వైన; చవులు=రుచులు. (2) వేల్పు=దేవత; మోహరము=యుద్ధముకొఱకు సమర్పఁబడినపన్నాగడ (వ్యూహము). (3) అడియాస=వ్యర్థ మైనకోరిక(గల); గుడిమణియము=గుడిపెత్తనము; కూరిమి=స్నేహము. (4) చొప్పడు=దొరకు. (5) ఇమ్ముగన్=ఇంపుగా. (9) తెప్పలుగన్=నిండుగా; (10) విరసము=రసము లేనిది. (11) కొఱగాని=ప్రయోజనము లేని (ఏపనియు చేఁతగాని) (12) ఇరవు=(ఉండు) చోటు; పామరుఁడు=తెలివి లేని వాఁడు; హేమంబు=బంగారము (ధనము), భూమీశులు=భూమికి ప్రభువులు (రాజులు). (13) నెట్టుకొని=పూనుకొని. (14) సాడవు=పగ; భూతల నాథులు=భూప్రదేశమునకు అధిపతులు (రాజులు); బొంకమి=అసత్య మాడకుండుట; నీతి=న్యాయము; మానంబు=గౌరవము (మర్యాద). (15) ఫణి=పాము; ఖలునకున్=నీచునకు. (16) దోసకారి=తప్పుచేయునది. (17) పురి=పట్టనము; కరి=ఏనుఁగు. (18) నానార్థములు=అనేకము లైనవస్తువులు; కనకపు గట్టు=బంగారు కొండ (మేరు పర్వతము) (19) నిగ్రహించి=ఎదురుకొని. (20) చూపించి=

నిశ్చయము చేసి; ఎగ్గు=కీడు. (21) లావు=బలము; గాత్రము=పర్వతము; గజము=ఏనుగు. (22) మర్మము=రహస్యము (గుట్టు) (23) నృపతి=నరులకు ప్రభువు (రాజు); ఉడభూమి=శ్మశానము. (24) వాదు=నింద. (25) నారికేళ సలిలము=కొబ్బరికాయ నీరు. (26) నీతిపరుడు=న్యాయమునందు ఆసక్తి గలవాడు.

౨ వేమనశతకము.

పద్యము (1) విశ్వదాభిరామ=విశ్వ+ద+అభిరామ—విశ్వ=సమస్తమును, ద=ఇచ్చుటచేత, అభిరామ=మనోహరమైనవాడా? (2) చదురు=నేర్పుగల. (5) గిట్టనేమి=చచ్చిననేమి? చెడలు=చెడుపురుగులు; (6) తామసించి జాగుచేసి; వేగిరపడక=తొందరపడక; విషమమగు=సరిగానిదగును. (పాలుపోవుపనిభావము) (7) అల్పుడు=నీచుడు, ఆడంబరము గాను=పెద్దపెద్ద కేకలుగలుగునట్లుగా, సజ్జనుండు=మంచిమనుష్యుడు; కనకంబు=బంగారు. (9) సాధకమున=పరిశ్రమము తోడ కూడిన ప్రయత్నముచే నభ్యాసము. (10) ఖరము=గాడిద. (11) అంకిలి=అడ్డపాటు (చిక్కు); దివ్వె=దీపము. (12) కడుచిత్తుడు=గట్టిమనసు గలవాడు (13) కుంచె=(కుంచె)

గుణము గలది. (14) త్రాటన్=త్రాటిచేత; (15) కపటము= వంచన; ఉపకారము=మేలు. (17) గుణహీనుఁడు=(మంచి) గుణములేనివాఁడు (చెడ్డవాఁడు;) గుణవంతుఁగా=మంచివానిని. (19) తండోపతండమ్ములు=సంఘములు గుంపులు; ఉర్విఁగా=భూమి యందు. (20) ఘనత=గొప్పతనము; గోడు=దుఃఖము; అడఁ గనేని=నశించిపోయిన యెడల.

## కృష్ణశతకము

పద్యము (1) నారదసంగీతలోల=నారదుని సంగీతముసం దాసక్తి గలవాఁడా; ద్వారకనిలయ=ద్వారకాపురము నివాసము గాఁగలవాఁడా? (2) ధారాధరనీలదేహా=మేఘమువలె నల్లనిశరీ రముగలవాఁడా? (5) కారుణ్యపయోనిధి=కరుణాసముద్రుఁ డా! నాకాధిపవినుత=స్వర్గమునకుఁ బ్రభువైన యింద్రునిచేత స్తోత్రము చేయఁబడినవాఁడా. (7) గిరులు=పర్వతములు; సు రలు=దేవతలు. (8) భూరేణువులు=మంటిపలుకలు.

## కుమారీశతకము

పద్యము (1) శ్రీ=లక్ష్మీదేవి; భూ=భూదేవి; నీళా= జ్యేష్ఠాదేవి (పెద్దమ్మవారు); హైమవతీ=పార్వతీదేవి, భారతి= సరస్వతీదేవి; అతులసుభవతిగఁ=అతుల=తులలేని, శుభవతి

గస్=తేలుగలదానినిగా; (5) జోకిళ్లు=తగని నడతలు; (6) చిర
తరచింతక=దీర్ఘ విచారముచే (తీఱనిదుఃఖమున నమట.) దద్దిరం
బు=పేదతనము; గద్దింతురు=కసరుదురు; (19) కలుముల జవ
రాలు=లక్ష్మి; కలహము=పోరు.

## గుణము
### (తెలుపు)

పార్వతీపతి=పార్వతీదేవిమగఁడు (శివుఁడు); పాలసంద్రి
ము=పాలతో నిండియుండు సముద్రము (దీనినే క్షీరాబ్ధి యం
దురు); కామధేనువు=కోరికల నిచ్చు దేవతల ఆవు; శారదా
భ్రము=శరదృతువునందు గనఁబడుమేఘము (ఆశ్వయుజ కార్తి
కమాసములు శరదృతువు); శారదాంబిక=సరస్వతీదేవి (చదువు
లతల్లి); సంకు=శంఖము; ఐరావతము=దేవేంద్రునియేనుఁగు;
అమృతపూరము= అమృతప్రవాహము (అమృతము_దేవతల
బువ్వ); ఆదిశేషుఁడు=విష్ణుదేవుఁడు పవళించుపాము; కల్పవృ
క్షము=స్వర్గమున నుండు దేవతలచెట్టు; కైలాసగిరి=శివుఁడునివ
సించుకొండ. జాహ్నవి=ఆకాశగంగ; చందనంబు=మంచిగంద
ము, వెలఁదికి=ఆఁడుదానికి.

---

